# చిరంజీవి

అదొక దివ్యభవనము. ఆ భవనంలో పిల్లలువుండే గది మరింత శోభాయమానంగా వుంటుంది. ఆ గది చాలా విశాలమైనది. గాలి, వెలుతురు లోపలకు స్వేచ్ఛగావస్తాయి. కిటికీ తలుపులు ఎప్పుడూ తెరిచేవుంటాయి. గోడలకు అందమైన చిత్రాలు, ఫోటోలు వేలాడుతూవుంటాయి.

ఆ యిల్లు అవసరాల వారిది. ఆ గదిలో అవసరాల వారి పిల్లలు ఇందిర, శంకరం, సోమనాథం వుంటారు. ఆ యింట్లోకల్లా మరీ ఆకర్షవంతమయిన విషయం యేమిటంటే యీ పిల్లలను పెంచడానికి లీల అనే అందమైన ఆయా వున్నప్పటికీ వాళ్ళ పోషణభారమంతా 'నానా' అనే కుక్కే వహిస్తూవుంటుంది. అదే వాళ్ళను స్నానంచేయిస్తుంది. బట్టలు తొడుగుతుంది. వాళ్ళకు కావలసినవన్నీ చూస్తుంది.

మన కథ ప్రారంభమయే నాడు సాయంత్రం, నానా కుర్చీపక్కన పడుకుని చిన్న కునుకుతీస్తోంది. పిల్లల తల్లీ తండ్రీ ఎక్కడో డిన్నరుపార్టీవున్నదని వెళ్ళడానికి ఆయత్తపడుతున్నారు. పోతే వాళ్ళలా బయటికివెళ్ళినంతసేపూ పిల్లల పూర్తిబాధ్యత అంతా నానాదే నన్నమాట.

గోడ గడియారం టక్ టక్ మని ఆడుతూ ఆరుగంటలు కొట్టింది. అంటే పిల్లలను పడుకోబెట్టవలసిన సమయం అయిందన్నమాట.

నానా లేచింది. వళ్ళు సరిచేసుకుంది. జాగ్రత్తగా విద్యుద్దీపం వెలిగించింది. ఆ కుక్క యిలాంటిపనులన్నీ ఎంత

మెలుకువగా తననోటితో చేస్తుందో — మీరుగనుక చూస్తే చాలా ఆశ్చర్యపడిపోతారు.

తరువాత నానా పక్కబట్టలు సవరించింది. కిందబడి వున్న చొక్కాలు లాగులు వంకెలకు తగిలించింది. తరువాత స్నానాల గదిలోకి వెళ్ళి నీళ్ళు సమపాలుగా కలిపింది. ఎక్కువ వేడిగా లేవుకదా అని తను ముందు చేతులు నీళ్ళలో ముంచి చూచింది. ఆ పైన సోమనాథం దగ్గరకు వెళ్ళింది. పిల్లలలో సోమనాథమే చిన్నవాడుకనక, ముందుగా వాడినే నిద్రలేపాలి. సోమనాథాన్ని వీపుమీద ఎక్కించుకుని గుఱ్ఱంలా ఠీవిగా నడుస్తూ స్నానాలగదిలోకి వెళ్ళింది.

అయితే సోమనాథానికి స్నానంచేయడమంటే యిష్టం లేదు. కాని ఏంలాభం? నానా తలుచుకున్నదంటే ఆ పని తప్పనిసరిగాచేసి తీరాల్సిందే. అలవాట్లు ఆదమరచయినా మరిచిపోవడానికి వీల్లేదు. అంచేత సోమనాథాన్ని స్నానాల గదిలోకి తీసుకువెళ్ళి తలుపు వేసింది. ఇలా ఆ అబ్బాయి స్నానంచేస్తూవుండగా అమ్మగారు ఒకమారు తొంగి చూచింది. అమ్మగారు యిలా పిల్లల గదిలోవుండగా కిటికీ దగ్గర కీచుమని శబ్దం వినిపించింది. అటు తిరిగిచూచేసరికి బొమ్మలాంటి చిన్న అబ్బాయి కనిపించాడు. కిటికీ రెక్కల దగ్గర. కాని అంతలోనే — చూస్తూవుండగానే — మాయమై పోయాడు, అమ్మగారు ఆశ్చర్యంతో వేసిన కేకవిన్నాడు కాబోలు! ఆమె కిటికీ రెక్కపూర్తిగా తెరిచి బయటకు

చూచింది. కాని యేమీ కనిపించలేదు. పక్కయిళ్ళ కప్పులు, నీలాకాశం తప్ప యింకా చెప్పుకోదగినవేవీ కనిపించ లేదు.

ఆమెగారు కాకమ్మ కథలు గుర్తుకు తెచ్చుకుని భయ పడసాగింది. ఎందుచేతనంటే నిన్నకూడా సరిగ్గా యిలాంటి ఘటనే తటస్థించింది. ఏంజరిగిందంటే - నానా కిటికీదగ్గరకు వెళ్ళి దబాలున తలుపుమూసింది. అప్పుడు ఆ అబ్బాయి చొక్కా నానా నోట్లో యిరుక్కుపోయి యివతలకు ఊడి వచ్చేసింది. ఆమె దాన్ని జాగ్రత్తగా మడతపెట్టి దాచేసింది.

తల్లి పిలిచినమీదట పిల్లలు అక్కడికి బిలబిలా పరు గెత్తుకుంటూ వచ్చారు. వాళ్ళనుచూచి ఆమెగారు ధైర్యం కూడగట్టుకుంది. పిల్లలు వాళ్ళకు అత్యంత యిష్టం అయిన 'అమ్మ - నాన్న' హాల్లో ఆడుకుంటున్నారు. వాళ్ళ చిలక పలుకులు వింటూవుంటే ఆ మెగారి ముఖారవిందం వికా సంతో తొణికిసలాడింది. ఇంతలో నాన్నకూడా అక్కడికే వచ్చేశారు. ఆయనకు నెక్ టై బిర్రుగా బిగించుకోవడం చేత కాక చిరాకుకలిగింది. అమ్మగారు నిమిషంలో ఆయనకు టై బిగించారు. నాన్న కాస్సేపు సోమనాథాన్ని భుజంమీద ఎత్తుకు తిప్పి తరువాత ఉయ్యాలలో పడుకోబెట్టి వెళ్ళి పోయారు.

దురదృష్టవశాత్తు స్నానాలగదిలోనికి వెడుతున్న నానా నాన్నగారిని రాసుకుంటూ వెళ్ళింది. ఆయన పాంటుకు

కుక్క వెంట్రుకలు అంటుకున్నాయి. అల్లా జరగడం పెద్ద వాళ్ళకెవరికీ యిష్టం వుండదుగా మరి! అందుకని ఆయనకు బోలెడుకోపం వచ్చింది. ఆ కోపంలో 'నానా'ను డిస్మిస్ చేసేస్తానన్నారు.

కాని అమ్మగారు కిటికీదగ్గర కనిపించిన చిన్న ఆకారం నానా దానివైపు మొరగడం, కిటికీ తలుపు మూయగా చొక్కా చిరిగి యివతలకు రావడం యివన్నీ చెప్పింది. ఆయనకు ఆ చొక్కాను చూపింది. ఇలాంటి ఆపదలనుంచీ రక్షించుతున్న నానా యింటవుండటం గర్వకారణం అన్నది.

ఇంతలో నానా సోమనాథం తాగవలసిన మందు ఔన్సుగ్లాసులో పోసుకుని వచ్చింది. దాన్నిచూచి అమ్మగారు 'చూడండి, నానా ఎంత బాగా ఉపయోగపడుతూందో' అంది.

సోమనాథం అల్లరిపిల్లాడు. మందు తాగడానికి ఎప్పుడూ పేచీ పెడుతూవుంటాడు. అప్పుడు ఇందిరకు మంచి ఆలోచనతడుతుంది, 'సోమనాథంతో పాటు నాన్నకూడా తన మందు తాగాలి! అప్పుడు వాడు యే పేచీపెట్టకుండా సులువుగా తాగేస్తాడు' అంటుంది.

'అలాగే! ఎవరు మంచివాళ్ళో చూదాం' అంటాడు నాన్న. మరోగ్లాసులో నాన్న మందుకూడా తయారవుతుంది.

'ఒకటి - రెండు - మూడు-' అంటుంది ఇందిర. సోమనాథం గుటుక్కున తనమందు తాగేస్తాడు. కాని నాన్న

మాత్రం తాగినట్లుగా నటించి తమాషాచేసి మందుగ్లాసు వీపుచాటున దాచుకుంటాడు.

కాని శంకరం యీ దొంగతనాన్ని కనిపెట్టేస్తాడు. 'నాన్న మందు తాగలేదు-' అని అరిచేస్తాడు. అప్పుడు సోమనాథం తను మోసపోయానని గ్రహించుకుని బావురుమంటూ యేడుపు ప్రారంభిస్తాడు.

అప్పుడు నాన్న పిల్లలను హుషారుచేయడానికి మరో ఎత్తు వేస్తాడు. తన గ్లాసులో మందు కాస్త నానా గిన్నెలో పోస్తాడు. అదేదో మంచిదే ననుకుని నానా మూతిపెట్టి నాకుతుంది. తీరా చేదు నాలుకకు సోకేసరికి నాన్న వేపుకోపంగా చూస్తుంది. నానాను ఎంతో ఆప్యాయంగా చూచుకునే పిల్లలకుకూడా నాన్నమీద కోపంవస్తుంది.

తన ఆలోచన పారకపోగా పిల్లలకు కోపంరావడంతో నాన్నకు చిరాకు ఎక్కువవుతుంది. అందుకని నానాను దొడ్లోకి తరిమేసి 'కుక్కలకు అదే తగినచోటు' అంటాడు. నానాను అలా అవమానిస్తాడు. అందరూ వద్దని ఎంతగా బతిమాలినా వినడు.

అమ్మ మాత్రం పిల్లలను ఓదారుస్తుంది. అందరు అమ్మలలాగానే వాళ్ళను ముద్దాడుతుంది. వాళ్ళను పడుకోబెట్టి జోలపాటలు పాడుతుంది. సన్నగా దీపం వెలిగించి పిల్లలు నిద్రపోయాక గదిలోంచి బయటకు వెడుతుంది. నాన్నతో డిన్నర్‌కు బయలుదేరుతుంది.

ఇప్పుడా పెద్దగది చాల నిశ్శబ్దంగావుంది. ఉన్నట్టుండి దీపాలు వెలిగాయి. తర్వాత ఆరిపోయాయికూడా. మళ్ళీ ఆ గదిలో ఒక కాంతిగోళం ప్రవేశిస్తుంది. ఈ మూలనుంచి ఆ మూలకు పరుగెత్తి మాయం అవుతుంది.

అప్పుడే అమ్మగారిని భయపెట్టిన చిన్న ఆకారం కిటికీ మాటునుంచి బయటకు వస్తుంది. కిర్రుమని చప్పుడవుతుంది. కిటికీ తలుపు బార్లా తెరుచుకుంటుంది. ఆ చిన్న ఆకారం లోపలకు ప్రవేసిస్తుంది, నెమ్మదిగా.

ఆ చిన్న అబ్బాయి దేనికోసమో వెతుకుతున్నట్లుంది. ఆలోచిస్తే మీకే తెలుస్తుంది. ఆ చిన్నవాడు తన చొక్కాకోసం తారట్లాడుతున్నాడని అతను నెమ్మదిగా 'కాంతిగంటా! ఎక్కడున్నావు?' అంటాడు. ఇందాకటి కాంతిగోళం వెలుగు కనిపిస్తుంది. 'నా చొక్కా ఎక్కడ పెట్టారు?' అంటాడు అబ్బాయి మళ్ళీ.

ఈ కాంతిగోళం నిజానికి ఒక దేవలోకపు అమ్మాయి. ఈ అమ్మాయికి తెలుసుకోదగిన అన్నిసంగతులూ తెలుసు. దేవలోకపువాళ్ళందరూ యింతే. ఆ అమ్మాయినిచూడాలని ప్రయత్నిస్తే చిన్నదీపం వెలుగుతప్ప యింకేమీ కనిపించదు. కాని ఆ అమ్మాయిని మీరు సులభంగా వినవచ్చును. కంచు గంట మోగుతున్నట్టు ఎప్పుడూ గణగణమని శబ్దంచేస్తూ వుంటుంది. అందుకనే ఆ అమ్మాయిని 'కాంతి గంట' అని పిలుస్తారు.

అటు యిటు తిరిగి కొంతిగంట చివరకు డ్రాయరు రెండో అరదగ్గర ఆగింది. అబ్బాయి సంతోషంగా అక్కడకు పరుగెత్తుకు వెళ్ళాడు. డ్రాయరు అరబయటకులాగి అందులో భద్రంగా అమర్చిన తన చొక్కా తీసుకున్నాడు.

చొక్కా అయితే దొరికిందికాని దాన్ని ధరించడం ఒక సమస్య అయింది. ఎలాగా అని ఆలోచిస్తూవుండగా ఒక ఆలోచన తట్టింది. చొక్కాకు సబ్బు అంటించి తన శరీరానికి అతికించుకోవచ్చును! ఒకచోట తీరుబడిగా కూర్చుని తన శరీరానికి చొక్కాకుకూడా సబ్బునురుగు పట్టించాడు. కాని లాభంలేకపోతోంది. ఎంత సబ్బుపట్టించినా చొక్కా శరీరానికి అమరడంలేదు — అతకడంలేదు.

ఇలా ప్రయత్నించి ప్రయత్నించి తుదకు విఫలుడై పోయాడు. చేతుల్లో ముఖందాచుకుని నిరాశగా నిస్పృహాగా యేడవసాగాడు.

సరీగా ఆ సమయంలో ఇందిర నిద్రమేల్కొని, పక్కమీాద లేచికూర్చుంది. ఏమాత్రం భయపడకుండానే 'చిన్నకుర్రవాడా ఎందుకు యేడుస్తున్నావ్ ?' అనడిగింది.

చిన్నఅబ్బాయి ఎగిరిగంతేసి నిలుచున్నాడు. ఇందిరకు వంగి అభివాదంచేశాడు. ఇందిరకూడా అతనికి ప్రత్యభివాదం చేసింది.

'నీ పేరేమిటి ?' అనడిగాడు అబ్బాయి.

'అవసరాల ఇందిర. మరి నీ పేరో ?'

'నా పేరు చిరంజీవి.'

'మీా యిల్లెక్కడ ?'

'కుడిచేతివైపు రెండో రోడ్డు — అలా సూటిగా పోవాలి. రేపు ఉదయందాకా అదేయిల్లు.'

ఈ చిరునామా ఇందిరకు తమాషాగా తోచింది. కాని చిరంజీవికి తల్లి లేదని తెలుసుకుని ఇందిర చాల సాను భూతి చూపింది. తల్లి లేని పిల్లవాడు యేడుస్తూవుండడంలో ఆశ్చర్యంలేదు.

కాని చిరంజీవి యిప్పుడు యేడుస్తూవుండడానికి కారణం అదికాదు. చొక్కా వొంటికి అమరడంలేదని, పాపం, యేడుస్తున్నాడు. ఇందిరకు నవ్వొవచ్చింది. సబ్బు వల్ల ప్రయోజనంలేదని చెప్పింది. చొక్కా శరీరానికి జోడించి కుట్టేశెయ్యాలని సలహా యిచ్చింది.

'ఆ పని చేసిపెట్టనా ?' అనడిగింది. అలా అంటూనే పనికి ఉపక్రమించింది.

ఈ విధంగా చొక్కా శరీరానికి జోడించి కుట్టడం అంటే చాల బాధ కలుగుతుంది. కాని చిరంజీవి యీా బాధను ఓర్పుతో సహించాడు. కుట్టినమీాదట చొక్కా సరిగ్గా అమరింది. హుాందాగా అమరింది. చిరంజీవి సంతో షంతో పరవశమై ఆ గదిలోనే గంతులువేయసాగాడు. 'నేనెంత తెలివిగలవాడిని !' అనుకున్నాడు.

'మోసగాడా ! నేనేమీా చేయలేదా ?'

'కొద్దిగా సహాయంచేశావులే.'

'కొద్దిగానే? సరే అయితే నేను వెళ్ళిపోతాలే.' అంటూ ఇందిర మళ్ళీ పక్కమీదకువాలి దుప్పటి ముసుగు పెట్టుకుని పడుకుంది.

చిరంజీవి చిర్గ్గా 'ఇందిరా! అలావెళ్ళిపోకు. నేనేదో సంతోషంలో అలాఅన్నానంతే రా అమ్మా! ఒక్క అమ్మాయి అంటే యిరవైమంది అబ్బాయిలపెట్టు' అన్నాడు.

ఈ మాటలు చిరంజీవి చాల తెలివిగానే అన్నాడు. ఏమంటే, యివి చెవినిపడడం తరువాయిగా ఇందిర మళ్ళీ లేచివచ్చింది. ఆమె చిరంజీవికి ఒక ముద్దుకూడా యివ్వడానికి సిద్ధపడింది.

ముందు చిరంజీవి అర్థంకానట్టుచూచాడు. తరువాత ఇందిర వేలికున్న ఉంగరంచూచి, బహుశ దాన్ని తనకు యివ్వాలనుకుంటూందేమోనని, చేయిముందుకు జాపాడు.

ఇప్పుడు ఇందిరకు, పాపం యీ కుర్రవాడికి ముద్దు అంటే యేమిటోకూడా తెలియదని అర్థం అయిపోయింది. కాని సమయాసమయాలు తెలిసిన పిల్లకనక అతన్ని గేలి చేసి అతని హావభావాలు చెడగొట్టలేదు. తన వేలిఉంగరం తీసి అతని వేలికి తొడిగింది - అంతే!

చిరంజీవి ఉంగరాన్నిచూచి ఎంతో ముచ్చటపడ్డాడు. 'నేనూ నీకో ముద్దు యివ్వనా?' అంటూ తనకోటు బొత్తాం ఒకటి ఊడలాగి ఇందిర చేతిలో పెట్టాడు.

ఇందిర దాన్ని ఆనందంగా తీసుకుని తనకంఠాభరణంలో అలంకరించుకుంది. అతని మనస్సులోని సమస్యను మరిచిపోయి, మరో ముద్దు యిమ్మని అడిగింది.

వెంటనే చిరంజీవి ఉంగరాన్ని తిరిగి యిచ్చాడు.

'నేను ముద్దు అడగలేదు ఉంగరం అడిగాను.'

'అంటే యేమిటి' అన్నాడు.

'అంటే యిలాంటిది!' అంటూ ఇందిర అతని చెక్కిలి మీద మృదువుగా ఒక చుంబనంచేసింది.

'ఓహో! ఎంత బాగుంది?' అంటూ చిరంజీవి, ఆమెకు ఎన్నో 'ఉంగరాలు' యివ్వసాగాడు. తరువాతకూడా ముద్దును ఉంగరంఅనీ, ఉంగరాన్ని ముద్దుఅనీ వ్యవహరిస్తూనే వచ్చాడు.

'చిరంజీవీ, నీకు ఎన్నేళ్ళు?'

'నాకు తెలీదు కాని నేను చిన్నవాడిని. పుట్టిననాడే పరుగెత్తుకు పారిపోయాను' అన్నాడు.

'పారిపోయావా? ఎందుకూ?'

'ఎందుకంటే – మా నాన్న అమ్మతో నేను పెద్దవాడినయ్యాక ఎలా పెద్దమనిషిలా వుండవలసిందీ చెబుతూవుండగా విన్నాను. నాకు పెద్దవాడినవడం యిష్టంలేదు. నాకెప్పుడూ చిన్న కుర్రవాడుగానేవుండి, ఆటపాటలతో హుషారుగా వుండాలనివుంది. అందుకని నేను పరుగెత్తుకు వెళ్ళిపోయి దేవతలతో కలిసిపోయాను.

ఇందిరకు ముందు నోట్లోంచి మాటరాలేదు. దేవతలనుగురించి తెలిసిన అబ్బాయి సరసన కూర్చున్నానన్న ఆశ్చర్యంలో మునిగిపోయింది. ఒక నిమిషంగడిచాక: చిరంజీవి! నీవు నిజంగా దేవతలను ఎరుగుదువా?' అనడిగింది.

'అవును. కాని అవిచాలమట్టుకు చనిపోయాయి. అదెలాగో నీకు తెలుసా? ఇందిరా, చెబుతానువిను. పసిబిడ్డ పుట్టినసారిగా, కిసుక్కున నవ్వుతుందిచూడు, అప్పుడా నవ్వులు పైకివెళ్ళి వెయ్యిముక్కలయి, ఒక్కో ముక్క ఒక్కొక దేవత అవుతుంది. ఈ ప్రకారంగా ఒక పసిబిడ్డ పుట్టినప్పుడల్లా ఒక దేవత తయారవుతూవుంటుంది. ఇలా అయితే ప్రతి పసిబిడ్డకు, అబ్బాయికానీ, అమ్మాయి కానీ ఒక్కో దేవతవుంటుందన్నమాట. కాని అలా లేదు. ఇప్పటి పిల్లలకు చాల సంగతులు తెలుసు. వాళ్ళకు దేవతలలో నమ్మకంలేదు. ఏ బిడ్డయినా నాకు దేవతలలో నమ్మకంలేదు అని పైకి అన్నప్పుడు, ఆ బిడ్డతాలూకు దేవత చచ్చిపోయి కిందరాలుతుంది!'

ఇలాచెప్పి చిరంజీవి దేనికోసమో వెదుకుతున్నట్లు గదంతా పరిశీలనగాచూచాడు. కాంతి మాయమయింది. అతనికి అదుర్దా ఎక్కువఅవుతూండగా గణగణమని గంటల చప్పుడువినిపించింది. దేవతలభాష తెలిసినవాడు కనుక చిరంజీవి ఆ శబ్దానికి అర్థం యేమిటో యిట్టే గ్రహించాడు.

లోగడ తన చొక్కా దాయబడిన డ్రాయరు అరపైకి లాగి తెరిచాడు. కాంతి గంట గబాలున బయటకు దూకింది. అలా తనను డ్రాయర్లో బిగించి మూత వేసేసినందుకు కోప గించుకుంది. తరువాత సంతోషంతో గదిలోగంతులు వేసింది. ఈ కోలాహాలానికి ఇందిర భయపడపోయి కెవ్వున కేక వేసింది. ఈ కేకవిని అదిరి, కాంతిగంట గడియారం చాటున దాక్కుంది.

'అయితే చిరంజీవి! నీవు దేవతలతో కలిసి నివశించ టం లేదంటావు. మరయితే ఎవరితో కలిసివున్నావు?'

'నేను కిందికి జారిపడిపోయిన అబ్బాయిలతో కలిసి వుంటాను.'

'వాళ్లెవరు?'

'ఎవరా? ఆయాలు మరేదో ధ్యాసలో వున్నప్పుడు ఉయ్యాలలోంచి కిందికిదూకి పడిపోయే వాళ్ళు. ఒకవారం రోజులలోపల వాళ్ళనెవరూ తమ పిల్లలుగా గుర్తించకపోతే అప్పుడు వాళ్ళను కనీ వినీ ఎరుగని దేశానికి పంపుతారు- అక్కడ ఖర్చులు రాబట్టుకోవడం కోసరం. నేనువాళ్ళ నాయకుడిని.'

'ఓహో! చాల తమాషాగావుందే నీ వ్యవహారం! అయితే చిరంజీవి, మరి మా కిటికీదగ్గరికి - ఎందుకు వస్తూ వుంటావు?'

ఈ గదిలో అమ్మ పిల్లలకు చెప్పేకథలు వినడానికి వస్తున్నానని చెప్పాడు చిరంజీవి. ఎందుకంటే రాలిపోయిన

పిల్లలకు తల్లులు వేరు - కథలు చెప్పేవాళ్ళు అంతకన్నా వేరు. తరువాత తను ఎలా శత్రువుల మీదికి తన సైన్యంతో దాడి వెడలేదీ, ఎలా దండుతో సముద్రం కొలనులో స్నానం చేసేదీ, ఆ కొలనులో జలకన్యలు అందాలరాశులు ఎలా స్నానం చేస్తూ ఆటలాడుకునేదీ ఇందిరకు చెప్పాడు, చిరంజీవి.

'ఇక నేను వెళ్ళిపోవాలి. పిల్లవాళ్ళు నాకోసం ఎదురు చూస్తూ వుంటారు. వాళ్ళకు రాకుమారుడి కథ నాకు తెలిసినంత వరకూ చెప్పాను. మిగతా కథ వినడానికి వాళ్ళు చాలా ఆదుర్దాగా వుండివుంటారు. నేను వెళ్ళిపోతాను' అన్నాడు చిరంజీవి.

కాని ఇందిర అతన్ని వుండమని బతిమాలింది.

'నీవు యిక్కడే కనక వుంటే నీకు ఎన్నో మంచి మంచి కథలు, ఎన్నడూ నీవు విననివి చెప్తాను.' అంది ఇందిర.

చిరంజీవికి మరో ఆలోచన తట్టి యిలా అన్నాడు :

నీవే నాతో వచ్చేసేయి, ఇందిరా అక్కడ మా అందర్నీ కూర్చోబెట్టి నీ కథలన్నీ వినిపించుదువుగాని. మా కందరికీ చొక్కాలు తొడిగి అలంకరించుదువుగాని. ఇంత వరకు మేం అలంకారాలంటే యేమిటో ఎరగము. మాకు నీలాంటి అమ్మాయే కావాలి, తప్పకుండా రా, ఇందిరా.'

ఈ ఆలోచనతో ఇందిరకుకూడా మనసులో ఉబలాటం ప్రారంభమయింది. అయినా తనకు ఎగరడం రాదుగా ! గాలిలో ఎలా యీదుకుంటూ వెళ్ళి

దేవతలతో కలుసుకుంటుంది? ఈ సందేహాలే చిరంజీవికి చెప్పింది.

'నేను నీకు గాలిలో ఎగరడం నేర్పుతాను, ఇందిరా!'

'నిజంగా నేర్పుతావా? నాతోపాటు సోమనాధానికి శంకరానికి కూడా నేర్పుతావా?' అనడిగింది, అమితోత్సాహంతో.

'అలాగే నేర్పుతాను.'

వెంటనే ఇందిర వాళ్ళను యిద్దరినీ నిద్రలేపింది. వాళ్ళకు యీ కథంతా చెప్పి అలా కనీ వినీ ఎరుగని లోకానికి ఎగిరిపోదామంది. వెంటనే అక్కడికి ఎగిరిపోదామని చప్పట్లు చరిచారు, వాళ్ళుకూడా. చిరంజవి గదిలో పై పైకి ఎగురుతున్నాడు. ముగ్గురు పిల్లలునూ అతన్ని అనుకరించారు, అనుసరించారు. కాని రెక్కలు విరిగిన పక్షులలాగ వాళ్ళు నేలమీాదమటుకే కుప్పిగంతులు వేయగలుగుతున్నారు.

'నేను వాళ్ళమీాద మంత్రచూర్ణం చల్లకపోతే వాళ్ళు ఎప్పటికీ ఎగరలేరు.' అనుకుని చిరంజీవి మంత్రిస్తున్నట్లుగా వాళ్ళవేపు చూాచాడు. ఇక ఎగరటానికి ప్రయత్నించమన్నాడు.

వాళ్ళు అలానే ప్రయత్నించారు. పైకి ఎగరగలిగారు. మొదట నేలమీాదినుంచీ పక్క అంతఎత్తు ఎగిరారు. తర్వాత పక్కమీాదనుంచి యింటికప్పువరకు ఎగిరారు. ఇక ఎగరగలం

అని ధైర్యం వచ్చిన తర్వాత స్వేచ్ఛగా హాయిగా చిరంజీవిలాగానే పైపైకి ఎగిరారు.

'కాంతీ! దారిచూపు.' అన్నాడు చిరంజీవి. కాంతిగంట అమ్మాయి నక్షత్రంలాగ ముందుకు దూసుకుపోయింది. పిల్లలెవరూకూడా మంచిదుస్తులు వేసుకోవాలనే ధ్యాసలో లేరు. అలా నిద్రలో నలిగిన గుడ్డలతోనే ఎగిరారు. శంకరం మటుకు కిటికీపైగా వెడుతున్నప్పుడు అక్కడ వేలాడుతున్న టోపీ అందుకుని ధరించాడు.

కాంతిగంట బాగా ముందుకు వెళ్ళిపోయింది. అందుకని చిరంజీవి వాళ్ళకు దారిచూపుతూ ముందుకు నడుస్తున్నాడు. కాంతికి కొత్తవాళ్ళకు విద్యనేర్పే ఓర్పు లేదు.

ఒకనిమిషంగడచాక – డిన్నర్ పార్టీనుంచి తిరిగివచ్చిన అమ్మ నాన్నాను వెంటబెట్టుకుని పిల్లలగదిలోకి పరుగున వచ్చింది. ఏమంటే నానా పిల్లలు లేకపోవడం కనిపెట్టి గొలుసు తెంపేసుకుని పరుగెత్తి ఆమెకు ఆ వార్త చెప్పింది. కాని అప్పటికే ముగ్గురు పిల్లలూ కనీ వినీ ఎరగని లోకానికి మార్గమధ్యంలోవున్నారు.

కనీ వినీ ఎరుగని ఆ లోకంలో, జారిపడిన కుర్రవాళ్ళు దట్టమైన అడవులలోను కొలనుతీరాలలోను వుంటున్నారు.

చెట్లు ఆకులురాలి బోసిగావున్నాయి. దూరంగా తోడేళ్ళ అరుపులు వినవస్తున్నాయి. పురుగుపుట్ర నేలమీద పాకులాడుతున్నాయి. అక్కడి కుర్రవాళ్ళందరూ తమ నాయకుడైన చిరంజీవి ఎటో వెళ్ళిపోయాడనీ, యింకా

రావడంలేదామా అనీ ఆదుర్దాగావున్నారు. అక్కడ ఆరుగురు కుర్రవాళ్ళువున్నారు. వాళ్ళలో యిద్దరు కవలలు. ఇద్దరూ ఒకేపోలికగావుంటారు. వాళ్ళను ఎవరు ఎవరో గుర్తించడం కష్టం. ఈ కుర్రవాళ్ళు నలకలలాగ భూమిక్రింద నివసిస్తూవుండేవారు. వాళ్ళకు ఒక్కొక్కళ్ళకు చెట్టుతొర్రల్లో మెట్లు మెట్లుగా దారివుంది. ఈ మెట్లకిందుగా పరుగెత్తుకుంటూ వెళ్ళి వేరులుకూడా దాటి పాతాళానికి వెళ్ళిపోతారు.

కుర్రవాళ్ళు ఉల్లాసంగా ఆడుకుంటున్నారు. చిరంజీవి యింకా రావడంలేదేమా అని మనసులో ఒకటే కళవెళపడుతున్నారు.

ఇంతలో ఒక యీల వినుగా వినిపించింది. యెవరో నృత్యంచేస్తున్న శబ్దంవినిపించింది. సముద్రం దొంగల సవ్వడి వినిపించింది. ఇద్దరు కుర్రవాళ్ళు ధైర్యంగా తమ తమ స్థావరాలలోనికి పారిపోయారు. మిగతావాళ్ళు మాత్రం తప్పించుకుపోలేకపోయారు. దొంగలు నాయకుని వెంట ముందుకు వచ్చేసరికి వాళ్ళు చెట్టుతొర్రలోనికి మాత్రం చేరుకోగలిగారు. ఈ దొంగల నాయకుని అంత దుర్మార్గుడిని యెవరూ చూచివుండరు. అతనిది భీకరాకారంకూడాను. నిప్పులు చెరిగే కళ్ళు. అతని ముఖం ముడతలుదేరి ఎన్నో దుష్టాలోచనలకు చెడుతలంపులకు ఆలవాలమైవుంటుంది. ఆ ముఖంలో గడ్డం అసలు కనిపించనే కనిపించదు. అతని ముక్కు పెద్ద ఎండ్రకాయలావుంటుంది. పొడుగాటి నల్లని జుత్తునుచూస్తే

నాగుపాము లేమోనని భయం వేస్తుంది. ఆ జుత్తు ఉంగరాలు ఉంగరాలుగా గిరజాలుతిరిగి ముఖం అంతటా పడుతూ వుంటుంది. అతని భీకరాకారాన్ని యీ జుత్తు మరింత యెక్కువ అసహ్యంగా చేస్తుంది.

అతని చేతిలో ఒక యినుప ఊచవుంది. దాన్ని విలాసంగా తిప్పుతూ హుషారుగా యేదో పాటపాడుతున్నాడు. అతను చాల క్రూరమయినవాడు. యెంత క్రూరమయినవాడంటే అంత కర్కోటకుడు దుర్మార్గుడు యిక యీ ప్రపంచంలో యెవరూ వుండరు! అతని సేవకులకు సహచరులకుకూడా అతన్ని చూస్తే భయమే. ఇక తప్పిపోయిన కుర్రవాళ్ళు అతన్ని చూడడంతోటే తమ తమ గృహాల్లో తల దాచుకోవడంలో ఆశ్చర్యం యేముంది?

ఇప్పుడు యీ క్రూరుడు చిరంజీవి కోసరం వెదుకుతూ వస్తున్నాడు. యెందుకంటే యీ మధ్య తప్పిపోయిన కుర్రవాళ్ళకు సముద్రపుదొంగలకు జరిగిన యుద్ధంలో చిరంజీవి అతనికుడిచేతిని నరికి దారినిపోయే మొసలికి ఆహారంగా నివేదించాడు. ఆ మొసలి యీ చేతిని కరకర నమిలి తిని ఆ రుచి కోసం తపించసాగింది. నాయకుడి తతిమ్మా శరీరం కోసరం అన్ని సముద్ర ప్రాంతాలు వెదుకుతూ తిరుగుతోంది.

ఈ క్రూరుడికి చిరంజీవిని అసహ్యించుకోవడానికి తగినంత కారణం వుండనేవుంది. కాని మొసలి వెంటాడుతూ రావడంవల్ల దాని బారినుంచీ తప్పించుకోవడానికి విసుగు విరామం లేకుండా పరుగెత్తవలసివస్తోంది. ఇతని అడుగులజాడ

కనిపిస్తేచాలు, మొసలి పరుగెత్తుకుంటూ వస్తోంది. ఇలా అతన్ని విచిత్రంగా నేస్పగా వెంటతరుముతోంది. మొసలి నిద్రపోతూన్నప్పుడు మాత్రమే యితనికి కాస్సేపు విరామం చిక్కుతుంది. ఏమయినా యీ రకం జీవితం చాల దుర్భరంగావుంది. అయితే యీ మధ్య అదృష్టవశాత్తు ఆ మొసలి ఒక గడియారాన్ని మింగింది. ఆ గడియారం చాల గట్టిది. మొసలి కడుపులో కూర్చునికూడా టక్ - టక్ మని చప్పుడు చేస్తోంది. ఈ చప్పుడు వినిపించడంతో దొంగల నాయకునికి మొసలివస్తూన్నట్లు తెలుస్తోంది. ఒక్కొక్కప్పుడు యేమరుపాటునవున్నా గంటల చప్పుడువినిపించినప్పుడు కర్తవ్యం గుర్తుకువస్తోంది.

దొంగల నాయకుడు గుబురైన పొదలమాటున కూర్చున్నాడు. అక్కడ కూచున్న కాస్సేపు ఉక్కగావుంది. పైగా కిందినించీ వేడివేడి సెగలువస్తున్నాయి. పరికించి చూడగా నేలకింద యేదో యిల్లువున్నట్లుంది.

దొంగల నాయకుడు యిదేమా అని ఆలోచించి బహుశ యిక్కడే అనాథబాలురు నివసిస్తూవుండి వుంటారు - అని నిర్ణయించుకున్నాడు. వెంటనే ఒక దురాలోచన చేశాడు. బాగా పెద్దసైజు రొట్టెవకటి తయారుచేసి యిక్కడే వదిలివెళ్ళినట్లయితే ఆనాథబాలురు యిటువైపుగా వచ్చినప్పుడు చూచీ చూడకుండా గబుక్కున రొట్టెముక్కలు నోట్లో వేసుకుంటారు. తాను కసికొద్దీ రొట్టెలో విషం కలిపితే - వాళ్ళు మంచినీళ్ళుకూడా అడక్కుండా మరణిస్తారు.

నాయకుడు యీ ఆలోచనను తన అనుచరునితో చెప్పాడు. ఇద్దరూ ఆనందంతో గంతులు వేశారు.

తీరా కార్యరంగంలోకి దిగబోయేసరికి 'టక్ టక్ — టక్ టక్' మంటూ చప్పుడు వినిపించింది.

'మొసలి వస్తోంది. మొసలి వస్తోంది' అని కెవ్వున కేక పెట్టాడు దొంగల నాయకుడు. ప్రాణరక్షణార్థం అడవిలోకి పరుగెత్తాడు. కింద అనాధబాలురు సురక్షితంగా వుండి పోయారు. వారి పెంపుడుకుక్క 'టైగర్ లిల్లీ' నేలవాసన చూసి దొంగలు పారిపోయిన మార్గం పసికట్టి వెంటపడి తరుముతోంది. కాంతిగంట, ఇందిరలవలెనే టైగర్ లిల్లీకి కూడా చిరంజీవి అంటే ప్రేమ ఎక్కువ. అతని శత్రువులు తనకుకూడా శత్రువులే కదామరి!

తరువాత కొద్దిసేపటికి చిరంజీవి యింటికి తిరిగి వచ్చాడు.

అనాధబాలురందరూ ఇందిరను తమతో నేవుండి పోమ్మని యిక్కడ ఎన్నో వినోదాలు వేడుకలు చేసుకో వచ్చునని ఎప్పుడూ కధలువింటూ కూచోవచ్చునని బతిమి లాడి చెప్పారు. ఆమెనే అందరికీ తల్లిలావుండమన్నారు, ఇందిర చిరంజీవికనక అందరికీ తండ్రిగా వుండేందుకు అంగీకరిస్తే తానూ తల్లిగావుంటానన్నది.

తరువాత ఆమె వాళ్ళకు ఏడుగురు రాకుమారుల కధ చెప్పింది.

ఒకరోజు సాయంకాలం చిరంజీవి ఇందిరను తమ చిన్న కుటుంబాన్ని జలకన్యలువుండే కొలనుకు తీసుకు వెళ్ళాడు.

కనీ వినీ ఎరుగని లోకంలో ఎన్నో వింత వింత సంగతులువున్నాయి; ఎన్నో విచిత్రజీవాలువున్నాయి. కొన్ని సముద్రపు దొంగలు, తాడేళ్ళు, మొసళ్ళలాగ భయంకరమయినవి. మరికొన్ని దేవతలు, జలకన్యలలాగ అందమైనవీ ఆకర్షవంతమయినవీని.

ఇంతకుముందెప్పుడూ జలకన్యను చూడలేదుకనుక ఇందిర ఆమె సోదరులు ఎంతో ఆశ్చర్యపోయారు. జలకన్య అంటే నడుమువరకూ మానవస్త్రీలాగానే వుంటుంది. కాని ఆ పైన పెద్దతోకవుంటుంది. వాళ్ళ అదృష్టంకొద్దీ కొలను గట్టుకువచ్చేసరికే, ఒక జలకన్య అప్పుడే పైకివచ్చి రాతి మీద కూర్చునివుంది, అలా విలాసంగా కూర్చుని తన పొడుగాటి కురులను తీరుబాటుగా దువ్వుకుంటూంది. ఆమె మీద చంద్రుని వెన్నెల కిరణాలు పడుతున్నాయి. ఆ కాంతిలో ఆమె సువర్ణసుందరిలా ధగధగ మెరిసిపోతోంది. ఆమె అలా తల దువ్వుకుంటూ కూర్చుని పాటలు ఆలపిస్తోంది, పిల్లలు ఆమెను చేరుకోవాలని వేడుకపడుతున్నారు.

పిల్లలు నీటలోదిగి ముందుకు పరుగెత్తారు. వీళ్ళు రావడంచూచి ఆ జలకన్య 'మనుష్యులు' అని భయంగా పెద్ద కేకవేసి నీటిలోనికి దూసుకు వెళ్ళిపోయింది.

'అదుగో అటుచూడండి - అక్కడ మరో జలకన్య ఉంది. ఆమెను మనం పట్టుకోవచ్చు' అన్నాడు శంకరం. అంటూనే అటువైపు పరుగెత్తి జలకన్యను తనచేతిలో యిరికించుకున్నాడు. కాని ఆ జలకన్య ఎలానో జారి నీటిలోకి వెళ్ళిపోయింది. చాకచక్యంగా అతనిపట్టు విడిపించుకుంది. ఇదిచూచి పిల్లలు ఆశ్చర్యంతో మూగవోయారు. శిలలమీద నిలుచుని చప్పట్లుకొట్టారు. వీళ్ళలా కేరింతలు కొడుతూండగానే మధ్యలో 'సముద్ర చోరులు' అనే కేక వినిపించింది.

ఇటువైపే ఒక పడవ వస్తూంది. దీనిలోనే యిద్దరు సముద్రచోర నాయకులు కూర్చునివున్నారు. కౄరవాళ్ళందరూ బిలబిలా తీరానికి యీదులాడారు. చిరంజీవి పడవవంక చూచాడు. చోరులవెనక 'టైగర్ లిల్లీ' తాటితో బంధింపబడివుంది. ఒక్కనిమిషంలోనే అతనికా చోరులు యేంచేయబోతున్నారో అవగతమయింది. వాళ్ళు టైగర్‌ను కొండరాతిమీద వదిలివేస్తారు. సముద్రపుటలల విసురుకు అది మునిగిపోతుంది; ప్రాణాలు కోల్పోతుంది. చిరంజీవి దానినెలాగయినా రక్షించాలనుకున్నాడు. తెలివిగా ఒక ఉపాయంపన్నాడు. క్రూరుడైన దొంగల నాయకుడి గొంతుతో 'తాళ్ళు తెంపేసి దాన్ని వొదిలేయండి!' అని పెద్దగా అరిచాడు. అంతే! వెంటనే అతని ఆలోచన ఫలించింది. నాయకుని గొంతువిన్న చోరులు, అతని ఆజ్ఞలు పాలించకపోతే తమకేమి ముప్పు వాటిల్లునో అని - టైగర్ లిల్లీని వొది

లాగు అది నీటిలో యీదుకుంటూవచ్చి పిల్లల సరసన చేరింది,

దొంగలు వెనక్కి మరలి తెడ్లు నడుపుతున్నారు. దొంగల నాయకుడు వారికి ఎదురుగావచ్చాడు. అప్పుడు గాని వాళ్ళు తమకుజరిగిన మోసాన్ని గమనించలేక పోయారు. అప్పుడా నాయకుడు తనసేవకులను కోపంగా తరిమికొట్టాడు. తానే స్వయంగా టైగర్ లిల్లీని పట్టుకోవడానికి బయలుదేరాడు.

కాని ఎప్పుడయితే దొంగల భయంపోయి, తాము జాగ్రత్తగా తప్పించుకోగలిగారో, చిరంజీవి అతని స్నేహితులు అప్పుడే కొండశిల వెనుకదాగుండి దొంగలనాయకుడిని పట్టుకోవడానికి పొంచివున్నారు. అతనిప్పుడు ఒంటరిగానే వుంటాడుగనుక తమపని సులువుఅని వారికి తెలుసు.

ఘోరమైన పోరాటంజరిగింది. దొంగల నాయకుడు చిరంజీవితో ద్వంద్వయుద్ధానికి తలపడ్డాడు. ఇంతలో మిగతా పిల్లలు టైగర్ లిల్లీని తీసుకుని దొంగల పడవలోనే ఎక్కి దూరంగా వెళ్ళిపోయారు.

చివరకు యింకా ఎదిరించి పోరగల సాహసంలేక దొంగల నాయకుడు తిరుగుదారిపట్టాడు. సముద్రం లోనికి యీదుకుంటూపోయాడు. చిరంజీవికి బాగా గాయాలు తగిలాయి - ఈదటానికిగాని ఎగిరిపోవడానికిగాని ఓపికలేకుండా పోయింది. ఇందిరకూడా దాదాపు యీ స్థితిలోనేవుంది ఒక పక్కనుంచి మరోపక్కకు కదలడానికికూడా చేతకాకుండా

అయింది. చిరంజీవి చాల శ్రమమీద ఆమెను ఒక ఒడ్డుకు చేర్చగలిగాడు. కాని సముద్ర కెరటాలు మీదిమీదికి వస్తున్నాయి. సముద్రం నీరుపొంగి వస్తోంది, ఎక్కువసేపు యిక్కడేవుండటం అంటే ప్రమాదానికి లోనవటమన్న మాట. ఈ పరిస్థితి పరికించి చిరంజీవి నిరాశచెందాడు.

ఉన్నట్టుండి కొలనుమీదుగా ఒక గాలిపటం ఎగురుతూవచ్చింది, ఒక్క సెకనులో చిరంజీవి దాని దారం పట్టుకున్నాడు. ఇందిర నడుముకు దారాన్ని గట్టిగాబిగించి కట్టి ఆమెను భద్రంగా పైకి పంపేశాడు.

తరువాత నీటిమట్టం ఎక్కువయినకొద్దీ చిరంజీవి తన్మయావస్తకు లోనయ్యాడు నీళ్ళు అతనిపాదాలను ముంచేశాయి. ఇలా యిక్కడ చావడమంటే చాలభయంగా వుంది. ఇంతలో అటునైపే ఆకాశంమీద ఎగురుతూ గరుడ పక్షి వస్తోంది.

గరుడపక్షి చిరంజీవికి స్నేహితురాలు. అల్లంతదూరం నుంచె అతని దురవస్తను పరికించి సమయానికి సహాయం చేద్దామనే సత్సంకల్పంతో పరుగెత్తుకుంటూ వచ్చింది.

పాతాళ గృహంలో రోజులు సంతోషంగా దొర్లి పోతున్నాయి. ఇందిర అందరికీ చల్లని తల్లిగానడుస్తోంది. చిరంజీవి అందరినీ తండ్రిలా కాపాడుతున్నాడు.

ఆ గుహ విశాలమైనదీ, పెద్దదీని దానిని తొలిచిన శిలలు గోధుమవర్ణంలోవున్నాయి. అక్కడ గుహాలలో నివసించేవారికి అవసరమైన వస్తువులన్నీ సమకూర్చివున్నాయి.

ఇందిర అక్కడకు చేరిన కొద్దిరోజులలోనే ఆ యింటిని ఎంతో ముచ్చటగా సర్దింది. తమ యింటిమాదిరిగానే ఎంతో సదుపాయంగా తయారుచేసింది. ఎంత స్వల్ప సరంజామా అయినా తెలివయిన ఆడపిల్లలు యింటిని చక్కగా తీర్చిదిద్దగలరు. కుర్రవాళ్ళందరూ పడుకోవడానికి అనువుగా పెద్ద శయ్యవుంది. చిన్నవాడైన సోమనాథానికి బుట్టఊయల వుంది.

గదిలో ఒకమూల రంగుతెరల మరుగున కాంతిగంట కోసం ఒక పక్క వుంది. ఆ దేవతాబాలికకోరికలకు అనువుగా అలంకరించబడివుంది.

కుర్రవాళ్ళకు కొయ్యతో చేసిన బల్లలున్నాయి. రెండు కుర్చీలున్నాయి. ఈ కుర్చీలలో చిరంజీవి, ఇందిర కూర్చుంటారు. వాళ్ళే పిల్లలందరికీ తలిదండ్రులు కనుక వాళ్ళకా ఉన్నతాసనాలు !

ఒక శనివారంనాటి రాత్రి, ఇందిర తతిమ్మా పిల్లవాళ్ళు కిందనే ఆరుబయట కూర్చునివున్నారు. వేటకు వెళ్ళిన చిరంజీవికోసం ఎదురుచూస్తున్నారు. బయట టైగర్ లిల్లీ యింకా యిద్దరు ముగ్గురు దృఢకాయులు దొంగలురాకుండా కాపలాకాస్తూన్నారు.

ఇలావుండగా దూరంగా అడుగులచప్పుడు వినిపించింది. చిరంజీవి వస్తున్నాడనుకున్నారు. టైగర్ లిల్లీ అతన్ని కలుసుకోవడంకోసం ముందుకుపరుగెత్తింది. పిల్ల

వాళ్ళందరూ అతనికి స్వాగతం యివ్వడానికి వేచివుంచు న్నారు.

తండ్రిగా చిరంజీవి అంత మంచివాడు! పిల్లవాళ్ళ కోసం పండ్లు, ఫలాలు తేవడం ఎప్పుడూ మరిచిపోయేవాడు కాడు. అతను యింటికిరాగానే పిల్లలందరూ అతని కోటు జేబులన్నీ వెదికి తమకోసం తెచ్చినవి అప్యాయంగా తీసుకుని అనుభవిస్తారు.

ఆపైన అతను ఇందిరవైపు తిరిగాడు ఇందిర పిల్ల వాళ్ళ చొక్కాలుకొడుతూ దూరంగాకూర్చునివుంది. గోధుమరంగు దుస్తులు ధరించివుంది. తలలో పూలమాల ఎర్రగా అందంగా కనిపిస్తోంది. ఆమెనలాచూచి చిరంజీవి ముగ్ధుడయ్యాడు. వాళ్ళిద్దరూ తామే నిజంగా యీ పిల్లల తలిదండ్రులయినట్లు వాళ్ళ ఆటపాటలనుగురించి సరదాలను గురించి ముచ్చటించుకున్నారు.

ఆ సంతోషాతిశయంలో పిల్లలు నృత్యం ఆరంభిం చారు. చిరంజీవి, ఇందిరమటుకు తాము వయోధికులము కనక యీ ఆటల్లో పాల్గొనమని దూరంగా చూస్తూ కూర్చున్నారు.

చిరంజీవి గొంతెత్తి కమ్మగా ఒకపాట ఆలపించాడు. ఇందిర ఎంతో సంబరపడింది. ఈ పాటను చిరంజీవికంటే హాయిగా ఎవరూపాడలేరని ఆమె విశ్వాసం. పిల్లలంతా పాటకు అనుగుణంగా నృత్యంచేస్తున్నారు.

ఇలా చాలసేపు ఆడుకున్నాక పిల్లలందరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. నిద్రపోయేముందు ఇందిర ఒక కథచెప్పాలని కోరారు. అందరూ ఆమె చుట్టూ మూగారు. అందరు పిల్లల లాగానే ఆమె కథచెప్పతూన్నంతసేపూ అడ్డుప్రశ్నలువేస్తూ న్నారు. ఇందిర అలానే కథచెబుతూ కూర్చుంది.

కాని యీ కథ శంకరానికి సోమనాధానికి చిరంజీవికి కూడా యిదివరకు ఎక్కడో ఎగిరినట్లే అనిపించింది. ఏమంటే అది అవసరాలవారికథే! శీతాకాలంనాటి ఒక రాత్రి అవస రాలవారి పిల్లలు ఎటో వెళ్ళిపోవడం, తలిదండ్రులు వారి కోసరం ఎంతో ఆదుర్దాపడడం, ఎప్పుడూ తలుపులు తెరుచు కుని పిల్లలరాకకోసరం తపస్సుచేస్తూవుండడం – యిదీ కథ!

కథ చెప్పడం పూర్తి అయ్యాక చిరంజీవి యిలా అన్నాడు: 'లేదు, ఇందిరా. నేనూ యిలానే అనుకున్నాను. కాని తలుపులు ఎప్పుడూ తెరిచేవుంటాయంటావా? ఏమంటే పూర్వం నేను మాయింటికి తిరిగి వెళ్ళినప్పుడు అక్కడ కిటికీ తలుపులు సైతం మూసేవున్నాయి. ఊయలలోమటుకు మరో చిన్న కుర్రవాడు ఊగుతూ కనిపించాడు.

చిరంజీవి యిలా అనడంతో ఇందిర అతనివంక భయంగా చూచింది: 'బహుశ ఈ సరికి అమ్మ విచారంతో సగం చిక్కిపోయివుంటుంది' అంది. శంకరం, సోమనాధం యిక యీ కనీ వినీ ఎరుగని లోకంలో ఒక క్షణమైనా ఉండ లేమన్నారు.

తాను యింటికి వెళ్ళడం ఆలస్యమయి, అప్పుడే యింటిదగ్గర తమస్థానంలో మరో పిల్లలువుంటే - వాళ్ళకు నానా నీళ్ళుపోసి భోజనంపెట్టి జోలపాటలు పాడుతూవుంటే- తమకు ఎంత విచారం, ఎంత కష్టం, ఎంత బాధ! కనుక తాను వెంటనే యింటికి తిరిగి వెళ్ళిపోవాలి.

పిల్లలందరూ ఇందిరచుట్టూ మూగి ఆమెను యిక్కడి నుండి వెళ్ళిపోవద్దని ఎంతగానో బతిమాలారు. కాని ఇందిర తన పట్టుదల సడలించుకోలేదు. తనతో కూడా శంకరాన్ని సోమనాథాన్ని మటుకే కాదు, యీ పిల్లలందరినీ యింటికి తీసుకు వెడతానంది. పిల్లలు యీ మాటవిన్నాక ఎంతో సంబరపడ్డారు. యెందుకంటే వాళ్ళకందరికీకూడా తమ నిజం అమ్మలదగ్గరకు వెళ్ళాలనేవుంది. ఇందిరా వాళ్ళ అమ్మ తమను దగ్గరకు తీసుకుంటుంది, పెంచుకుంటుంది, ఆప్యాయంగా చూచుకుంటుంది! పిల్లలందరూ ఒక్కనిమిషంలో తమ ప్రయాణానికి సంసిద్ధులయ్యారు.

చిరంజీవి ఒక్కడుమాత్రం వీలుకాదన్నాడు. ఇందిరను వదలడమంటే అతనికీ యిష్టంలేదు. కాని అందరు మగ వాళ్ళలాగ పెద్దవాడవడం, గడ్డాలు మీసాలు పెంచుకోవడం అంటే సుతరామూ యిష్టంలేదు! ఈ కనీ వినీ యెరుగని లోకం విడిచివెళ్ళితే అలా అవడం రూఢి!

ఇక యిక్కడే అట్టేవుండిపోవడంతప్ప అతనికేమీ గత్యంతరం లేదు. ఇందిర తల్లిలాగే అతన్ని యెంతో గారాబు

చేసింది. వేళపట్టున సరీగా మందుపుచ్చుకుంటానని వాగ్దానం తీసుకుంది.

బయలుదేరబోతూండగా యింటివెలుపలనుంచి భీకరమైన చప్పుడు వినిపించింది. అరుపులు, పెడబొబ్బలు, కొట్టుకుంటున్న శబ్దం యిలా సముద్ర చోరులు జొరబడ్డారు. ఇంటి బయట కాపలావున్న దృఢకాయులతో పోరాటం సాగిస్తున్నారు. కుర్రవాళ్ళు లోపలనుంచి యీ గందరగోళమంతా ఆత్రంగా వింటూ ఆగిపోయారు. చిరంజీవి తన కత్తిపుచ్చుకుని గుమ్మందగ్గరే సిద్ధంగా నిలుచున్నాడు.

తొందరగానే పోరాటం ముగిసింది. కాపలావాళ్ళు బాగా దెబ్బలుతిని నేలమీదికి ఒరిగిపోయారు. దొంగలు విజయ గర్వంతో హాహాకారాలు చేస్తున్నారు. దొంగల నాయకుడు తెలివిగా చెట్టుతొర్రలో చెవివుంచి లోపలనుండి వినవచ్చే మాటలు ఆలకిస్తున్నాడు.

అతనికి చిరంజీవి చెబుతున్న పరమరహస్యం ఒకటి తెలిసిపోయింది. చిరంజీవి పిల్లలతో యిలా అంటున్నాడు: 'మన మనుషులుగెలిస్తే యింటిబయట టాం, టాం మోగిస్తారు.'

ఈ రహస్యం తెలుసుకున్న దొంగల నాయకుడు తన సేవకులను టాం టాం మోగించమని హెచ్చరికచేశాడు. ఈ శబ్దం వినరావడంతోటే లోపల ఆత్రుతగావున్న పిల్లలందరూ 'మనం గెలిచాం. యిక మనకేంభయంలేదు,' అని ఎగిరి గంతులువేశారు.

'అవును. ఇక మీరు మీ ప్రయాణం భద్రంగా కొన సాగించవచ్చు. కాంతి మీకు దారిచూపుతుంది.' అన్నాడు చిరంజీవి. వారంతా అతనివద్ద సెలవుతీసుకుని హడావడిగా తలుపులు తెరుచుకు బయటకునడిచారు.

బయట వాళ్ళకోసం దొంగలు కాచుకునివున్నారు. ఒక్కొక్క పిల్లవాడు బయటకు రావడంతోనే ఒక్కొక్క దొంగవాడిని కైవశంచేసుకుంటున్నాడు. ఇలా ఒకళ్ళ వెంట ఒకళ్ళు పిల్లలందరూ దొరికిపోయారు. దొంగలు పిల్లనందరినీ దగ్గరలోనే విడిసివున్న పడవలోనికి ఎక్కించారు.

అంతా యిలా ప్రశాంతంగా జరిగిపోయింది. చిరంజీవికి తనస్నేహితులు ప్రమాదానికి గురిఅయినారన్న విషయమే తెలియకుండా జరిగింది.

అతనికి తెలిసిన విషయమల్లా తాను వంటరివాడినని; ఇందిర తననువదలివెళ్ళిపోయిందని శంకరం - సోమనాధం యింకా తతిమ్మా పిల్లలందరినీ తనకూడా తీసుకెళ్ళిపోయిందనీ ఈ విచారంతో చిరంజీవి పక్కమీదికివాలి కడుపారా యేడ్చాడు.

దొంగల నాయకుడు యింకా అక్కడ తచ్చాడుతూనేవున్నాడు. చిరంజీవికూడా తతిమ్మా పిల్లలతోపాటు కిందికి దిగిరాకపోవడంతో అతనికి చికాకు ఎక్కువయింది. అతన్నికూడా ఎలాగయినా చిక్కించుకోవడానికి మరో మాయోపాయముపన్నాడు. ఇందాక ఇందిర చిరంజీవితో శ్రద్ధగా

మందుపుచ్చుకోమంటూ చెప్పడము నాయకుడికి గుర్తు కొచ్చింది. చివరిసారిగా మరో ఆలోచనచేశాడు. మెల్లిగా చిరంజీవి గదివైపుకు నడిచాడు. కిటికీచువ్వలలోనుంచి తన పొడుగాటి చేతినిదోపి చిరంజీవి మందుసీసాలో కాలకూట విషంకలిపాడు. ఈ కాస్తపనీ అయిన తర్వాత విజయ గర్వంతో పరుగుతీశాడు.

తరువాత కాస్సేపటికి యెవరో తలుపు తట్టారు.

ఏవరు ?' అన్నాడు చిరంజీవి నిద్రమత్తులో.

'తలుపుతియ్యి. తొందరగా'

చిరంజీవి ఛంగున లేచి తలుపు తెరిచాడు. కాంతిగంట రొప్పుతూ లోనికివచ్చింది. 'దొంగలు వాళ్ళను చుట్టుము ట్టారు. వాళ్ళను పడవలో వేసుకు వెళ్ళారు, అని చెప్పింది.

చిరంజీవి తన కత్తితీసుకుని పదును చేశాడు.

వాళ్ళను రక్షించటానికి బయలు దేరబోతూండగా ఇందిర మందుతీసుకోమని చెప్పినవిషయం గుర్తుకు వచ్చింది.

కాంతిగంట చిరంజీవి మందుసీసా నోటిదగ్గరకు ఎత్తు టంచూచింది. ఆ సీసాలో కాలకూట విషంకలిపిన విషయం, దేవతకనక కాంతిగంటకు తెలుసు. వెంటనే పైకి చిరంజీవి కంటే ముందుగా తనే ఆ సీసా కాళీచేసింది.

కాంతిగంట మరణావస్థలో కిందికి వాలింది. వెంటనే చిరజీవికి ఆ దేవతచేసిన త్యాగం తెలిసివచ్చింది. విచా రంతో అతనికళ్ళలో నీళ్ళుకమ్మాయి. బిగ్గరగా యిలా

అరిచాడు: 'మీకు దేవతలలో నమ్మకంవుందా? ఉన్నట్లయితే చప్పట్లు చరవండి! పాపం, కాంతిగంట బ్రతుకుతుంది.'

ఈ అరుపు ప్రపంచమంతటా వ్యాపించింది. కొన్ని కోట్ల చేతులు చప్పట్లు చరిచిన శబ్దం వినిపించింది. ఫలితం చాల తమాషాగావుంది. కాంతిగంట ప్రాణం లేచివచ్చింది. ఆరిపోతున్న దీపం క్రమంగా పెద్దదయి మామూలు స్థాయికి వచ్చింది. ఇప్పుడామె స్పష్టంగా మాట్లాడగలుగుతోంది.

కాంతిగంట మళ్ళీ మామూలుగా చిరంజీవికి తోడు వచ్చింది. ఇద్దరూ ఆపదలో చిక్కుకున్న పిల్లలను సంరక్షించటానికి వడివడిగా బయలుదేరారు.

ఓడ వడివడిగా దొంగల నాయకుడి భవనానికి చేరుకుంది. దొంగల నాయకుడు హుందాగానడుస్తూ విజయగర్వంతో తొణికిసలాడుతూ తన సేవకులను 'అందరికీ సంకెళ్లు వేశారా? లేకపోతే వాళ్ళు ఎగిరిపోతారు' అన్నాడు.

'వేశాం. వేశాం.'

'అయితే తీసుకురండి.'

దొంగల నాయకుడు ఒక ఎత్తుకుర్చీలో కూర్చున్నాడు. చేతులకు సంకెళ్ళు తగిలించిన పిల్లలు ఒక్కొక్కళ్ళే ఆతనిముందుకు ప్రవేశపెట్టబడుతున్నారు.

దొంగల నాయకుడు వాళ్ళలో యిద్దరిని మాత్రం రక్షిస్తానన్నాడు; అదీ వాళ్ళిద్దరూ తనదగ్గర పడవనడిపే సేవకులుగా చేరితేనే! తతిమ్మావాళ్ళనందరినీ సముద్రంలో

ముంచి చంపేస్తానన్నాడు. పిల్లలందరూ భయంగా ఒకరి ముఖాలొకరు చూచుకుంటున్నారు.

దొంగల నాయకుడు శంకరంవైపు తీవిగాచూచి 'యేం, నీవువస్తావా ?' అన్నాడు.

శంకరం ముందు సందేహించాడు. తాను చదువు కున్న పుస్తకాలలో నావికుడి జీవితం తమాషాగావుంటుందని వుంది. అందుకని ముందుకువచ్చి – వస్తాను. కాని నన్ను బాగాచూస్తావా ?' అనడిగాడు. దొంగల నాయకుడు హేళ నగా నవ్వి అలాగే అన్నాడు – తర్వాత సోమనాథాన్ని కూడా యిలాగే అడిగాడు – అతనూ వస్తానన్నాడు.

దొంగలు, శంకరం సోమనాథంలను ఒక పక్కగా నిలుచోబెట్టారు.

'ఇక వాళ్ళ అమ్మను తీసుకురండి' అన్నాడు నాయకుడు.

దొంగలు ఇందిరను గుంపులోనుంచి ముందుకు లాగారు – పిల్లలంతా అడ్డం వచ్చారు. కాని ఒక్కతోపుతో వెనక్కుపడ్డారు.

నాయకుడు ఆమెను తన పిల్లలకేమయినా తుది సందేశం యిస్తుంటేమోనని అడిగాడు. ఇందిరవాళ్ళతో ముచ్చటగా సంభాషించింది. వాళ్ళ నిజతల్లులు తమపిల్లలు యిలా పెద్దమనుషులుగా చనిపోవడాన్నె కోరుతారని చెప్పింది.

ఈ ఉపన్యాసంవిని పిల్లలంతా తమ తల్లులకోరిక నెర వేరుస్తామని బాసచేశారు. తరువాత, ఇందిరతోసహా పిల్లల నందరినీ తెరచాప కొయ్యలకు తాటితో కట్టి బంధించారు. ఇక వాళ్ళనందరినీ సముద్రంలో ముంచేసే కార్యక్రమం మిగిలివుంది. ఈ కాస్తపనీ యిక జరుగుతుందనగా, దొంగల నాయకుని ముఖకవళికలు మారజొచ్చాయి. 'టిక్ – టిక్ టిక్ – టిక్–' మంటూ అతనికి గడియారం గంటలు విని పిస్తున్నాయి.

'మొసలి వస్తోంది, నన్ను దాచండి.' అని అరిచాడు.

ఇలా భయంతో నిలువెల్లా వణికిపోతూ దొంగల నాయకుడు, దొంగలు పడవలోనికి పరుగెత్తారు. నాయకుడు ఒక మూలగా దాక్కున్నాడు. తతిమ్మాదొంగలు అతనికి వలయాకారంగా నిలుచున్నారు. తమ నాయకుని కాపాడ టానికి చుట్టూ కోటలా నిలుచున్నారు.

పిల్లలుకూడా కాస్సేపు యేంజరుగుతుందో అన్న భయంతో వణికిపోతూ నిలుచున్నారు. కాని మొసలికి మారుగా తమ నాయకుడు చిరంజీవి ముందుకు వస్తూండటం వాళ్ళు గమనించారు. చిరంజీవి ఒకచేతిలో 'అలారం గడి యారాన్ని పట్టుకునున్నాడు. దీనిశబ్దంవినే దొంగల నాయ కుడు మొసలి వస్తూన్నదని భయపడి దాక్కొన్నాడు.

స్నేహితులకు కనుసైగచేసి చిరంజీవి పడవ 'క్యాబిన్' లోకివెళ్ళి తలుపువేసుకున్నాడు. గడియారం టిక్ టిక్ వినా

పడకపోవడంతో దొంగల నాయకుడు నిర్భయంగా బయటకు వచ్చాడు.

వచ్చీ రాగానే 'యిక యీ పిల్లలను ముంచెయ్యండి' అన్నాడు.

వెంటనే గడియారం శబ్దం వినిపించసాగింది.

ఈసారి నాయకుడు భయంతో శిలావిగ్రహంలా నిలుచుండిపోయాడు. కాస్సేపయాక క్యాబిన్‌లోనించి చప్పుడు వస్తున్నదని గ్రహించి తన సేవకుడిని వెళ్ళి అదేమిటో చూచి రమ్మన్నాడు.

సేవకుడు వెళ్ళాడు కాని తిరిగిరాలేదు. గడియారం శబ్దంమటుకు వినవస్తూనేవుంది.

'ఇంకెవరయినా వెళ్ళి చూడండి' అని అరిచాడు నాయకుడు. ఎవరూ ముందుకురాలేదు – అప్పుడు నాయకుడు ఒక దొంగ పేరుచెప్పి అతన్ని వెళ్ళి చూడమన్నాడు. ఆ దొంగకు నాయకుని ఆజ్ఞ పాలించకపోతే వచ్చేముప్పు, ధైర్యంచేసి క్యాబిన్‌లోచూస్తే రాగలముప్పు తలపుకువచ్చి అమాంతం ఓడలోనుంచి కిందికి దూకాడు అదృష్టవశాత్తు ఒక తాడు దొరికింది. దాని ఆధారంతో పారిపోయాడు.

ఈవిచిత్రప్రవర్తనతో నాయకునికికోపంవచ్చింది. తానే వెళ్ళిచూచివస్తానని లేచాడు. కాని మళ్ళీ ధైర్యం చాలక కూర్చుండిపోయాడు – ఇంతలో అతనికొక చక్కని ఊహ తట్టింది. 'ఈ పిల్లలందర్నీ క్యాబిన్‌లో వదలండి. వీళ్ళు

అక్కడి భూతాన్ని చంపుతారా సరేసరి - లేకపోతే అదే వీళ్ళను చంపుతుంది' అన్నాడు.

సరిగ్గా పిల్లలకు కావలసిందికూడా యిదే. కాని భయపడుతున్నట్లే నటిస్తూ, తమ సంతోషాన్ని బయటకు కనపరచకుండా వాళ్ళంతా క్యాబిన్‌లోకి నెట్టబడ్డారు.

ఆ పైన దొంగలందరూ కళ్ళకు గంతలు కట్టుకుని కూర్చున్నారు. వాళ్ళను భయం బాగా లోగొన్నది. తమ కేదో ముప్పు రాసివున్నదని ప్రాణాలు అరచేతిలో పెట్టుకూర్చున్నారు. ఇలాకూర్చోవడంవల్ల చిరంజీవి పిల్లలందరినీ వెంటవేసుకుని క్షేమంగా బయటకువచ్చి పడవపైకి ఎక్కడం ఎవరూ గమనించలేదు. చిరంజీవి ఇందిరకట్లు తాళ్ళు తెంపి ఆ మెస్తానంలో తాను ఆ మెదుస్తులు ధరించి ముసుగువేసుకు నించుండటంకూడా ఎవరూ గమనించలేదు. పైన ఇందిర, పిల్లలు భద్రంగా నిలుచున్నారు.

'అదుగో ఆ పిల్లమూలంగానే యిదంతా జరిగింది! దొంగల పడవలో ఆడపిల్ల వుండటం ఎప్పుడూ క్షేమంకాదు. దాన్ని నీటిలో పారెయ్యండి' అన్నాడు దొంగలనాయకుడు కొంతసేపయ్యాక తెప్పరిల్లి.

దొంగలందరూ నాయకుని మాటలకు సరేనన్నారు. ఒక దొంగ ఇందిరను యిందాక కట్టేసిన తెరచాప కొయ్య దగ్గరకు వెళ్ళాడు.

'ఈసారి నిన్ను ఎవరూ రక్షించలేరు అమ్మాయీ' అన్నాడు.

'రక్షిస్తాను' అంటూ చిరంజీవి ముసుగు తొలగించు కుని యువతలకువచ్చాడు. 'అబ్బాయిలూ కిందికిరండి' అన్నాడు. కుర్రవాళ్ళంతా ఇందాక క్యాబిన్‌గదిలో చిరంజీవి యిచ్చిన ఆయుధాలు పుచ్చుకుని బిలబిలా కిందికి పరుగెత్తుకు వచ్చారు.

దొంగలు దిగ్భ్రాంతులయ్యారు.

అక్కడ జరిగిన పోరాటంలో పిల్లలు దొంగలందరినీ ఒక్కొక్కళ్ళనే సముద్రంలోనికి నెట్టారు.

చిరంజీవి నాయకుడితో పోరాడుతున్నాడు.

చివరకు నాయకుడు నిరాశగా యిలా అన్నాడు: ఇంతధైర్యంగా నాతో పోరాడుతున్నావు? ఎవరు నువ్వు!'

'నేను చిరంజీవిని.'

ఇలా అంటూనే చిరంజీవి నాయకుడినికూడా సముద్రం లోనికితోశాడు. నాయకుడు సరిగ్గా మొసలి పంజాలో యిరుక్కున్నాడు.

పిల్లలు సంతోషంతో ఎగిరిగంతులువేశారు. అంతా చివరకు అనుకున్నట్లుగానే జరిగింది. తమ శాశ్వత శత్రువు మరణించాడు.

ఈ పోరాటంలో హతులుకాకుండా యిద్దరు దొంగలు మాత్రం తప్పించుకోగలిగారు. వారిలో ఒకడు బుద్ధితెచ్చు కుని దొంగతనం మానివేసి నిజాయితీపరుడుగా నావికుడు జీవనం గడుపుతున్నాడు. రెండవవాడు తాను పూర్వంచేసిన పాపాలకుతగినఫలం అనుభవిస్తూసేవకవృత్తినిఅవలంబించాడు.

పిల్లలు సంతోషంతో గంతులువేయడం అయినాక, ఇందిరకు యిల్లు, తల్లీ తండ్రీ గుర్తుకు వచ్చారు. చిరంజీవితో యీ సంగతి చెప్పింది. ఈసారి చిరంజీవికూడా సంతోషంగా ఆమె వెంట ప్రయాణమయ్యాడు.

ఇంటిదగ్గర ఆవసరాలవారు విచార సముద్రంలో మునిగివున్నారు. తండ్రి తన పిల్లలు యిలా తప్పిపోవడానికి కారణం తను 'నానా'ను పనిలోంచి తొలగించడమేనని గుర్తించి, ఆ పాపానికి పరిహారంగా పిల్లలు తిరిగివచ్చేంత వరకు తాను నానా గుడిసెలోనే పడివుంటానన్నాడు. ఎంత మంది ఎన్నివిధాలుగా బతిమాలిచెప్పినా ఆయన ఆ పాకను వదిలి యివతలకు రావడంలేదు.

తల్లికూడా యిలాగే క్రుంగి కృశించిపోతోంది.

ఇలా వాళ్ళు విచారంతో ఉడికిపోతూవుండగా ఒక నాడు మూడు చిన్న స్వరూపాలు ఎగిరివచ్చి కిటికీదగ్గర వాలాయి ఇందిర మెల్లిగా తల్లిని పిలిచింది. తల్లి కళ్ళు తెరిచి చూచింది. తన కళ్ళను తానే నమ్మలేకపోయింది. తప్పిపోయిన పిల్లలు తిరిగివచ్చారు!

ఆమె యీ సంతోషంనుంచి తేరుకున్న తర్వాత ఇందిర – యింటి వెలుపల చిరంజీవి, తతిమ్మా పిల్లలు కాచుకుని వున్నారని చెప్పింది.

ఎటొచ్చీ ఉన్న చిక్కల్లా చిరంజీవితోనే. అతను ప్రథమ వీక్షణంలోనే తల్లినిచూచి సంబరపడ్డాడు. ఇందిరను ఆప్యాయంగా ఎంచుకున్నాను. కాని పెరిగి పెద్దవాడవడం

అంతే యిష్టంలేకుండావుంది. ఎప్పుడూ చిన్నపిల్లవాడుగానే ఉండిపోవాలనివుంది. ఎప్పుడూ పక్షులతో ఆడుకోవాలని, దేవతలతో కలిసి తిరగాలని, మనుష్యులకు సాధ్యంకాని పనులు చేయాలనివుంది.

చివరకతను కని విని ఎరుగని లోకానికి ఎగిరివెళ్ళటానికే నిశ్చయమయింది. సంవత్సరానికి ఒకమారు ఇందిర ఆలోకానికి వెళ్ళి ఒక వారంరోజులపాటు అక్కడ కులాసాగా గడిపిరావటానికికూడా యేర్పాటయింది.

కని విని ఎరుగ లోకంలో, ఎత్తయిన చెట్ల కొమ్మల మీద కాంతిగంట ఇందిరకోసరం ఒక యిల్లు నిర్మించింది.

చెట్టుకొమ్మలు పరుపులా మెత్తగావున్నాయి. రాత్రి పూటలు అక్కడ ఎర్రని, తెల్లని, నీలిరంగుల దీపాలు వెలుగుతాయి. ఎర్రరంగు దీపాలు మగదేవతలు. తెల్లనివి ఆడదేవతలు. నీలిరంగు దీపాలు యేమిటో వాటికే తెలియదు! నిశ్చలమైన ఆ ప్రకృతిలో పక్షుల కిలకిలా రావములు వినిపిస్తూవుంటుంది. వందలకొద్దీ గంటలు గణగణ మోగుతూ వుంటాయి. వీటన్నిటిలోకీ మధురమయినది, శ్రావ్యమైనది చిరంజీవి వేణునాదమే! అతను చిన్నయింటి ఆరుబయట కూర్చుని వసంతకాలం త్వరగా రావాలని కోరుకుంటూ వుంటాడు. ఎందుకంటే, వసంతకాలంలో ఇందిర అతన్ని చూడటానికి వస్తుంది.